# గంటల పంచాంగం

వ్యయ సం॥ ఆషాఢ శు॥ ఏకాదశి 1946 సం॥ జూలై 10 బుధవారం
ఋ॥ ఏకా ఉ 6-9 అనూ తె 2-42 శే వర్జ్యం సా 6-55 ను.
శు॥ ద్వాదశి జూలై 11 గురువారం
సు॥ ద్వాదశి ప 8-43 జ్యే 24 0 వర్జ్యం ప 10-1 ల 11-49ను.

ఆంధ్రపత్రిక
వ్యయ సం॥ ఆషాఢ శు॥ ఏకాదశి
బుధవారము

## ఆజాద్ అధ్యక్షత

ఆరు సంవత్సరములు అఖండ ప్రతిభతో కాంగ్రెసును నడిపిన మౌలానా అబుల్ కలాం ఆజాద్ మొన్న బొంబాయిలో జరిగిన అ. భా. కాంగ్రెసు స్థాయిసంఘ సమావేశమున అధ్యక్షపదవిని విరమించెను. మహాసభ జరుగువరకు శ్రీ ఆజాద్‌గారే అధ్యక్షులుగ నుండిన బాగుండునని సమావేశమునకు వచ్చిన ప్రతినిధులు, తదితరులు అభిప్రాయపడిన ఆశ్చర్యములేదు. నూతన అధ్యక్షుడు పండిత జవహరలాలుగారు అధ్యక్షస్థాన మిపుడంగీకరించుటా, కాదా అను అనిర్ణయ స్థితిలో నుండెను. కాని "గాంధీజీయొక్క, కార్యవర్గసభ్యుల యొక్క సలహా ననుసరించి" ఆయన అధ్యక్షపదవీ భారమును వహించ నిశ్చయించుకొనెను. గాంధీజీ, కార్యవర్గ సభ్యులు ఈ విధమైన సలహా నిచ్చుటకు ప్రత్యేక కారణములు లేకపోవచ్చును. ఆరు సంవత్సరముల కాలము కాంగ్రెసు అధ్యక్ష భారము వహించుట సామాన్య కార్యముకాదు. ఆ పదవికి ఉన్న గౌరవ ప్రతిష్ఠలతోబాటు అనేక అసామాన్య బాధ్యతలు కూడ నున్నవి. అసామాన్యప్రతిభ, శక్తి యున్నవారే దానిని నిర్వహింప గలరు. కాంగ్రెసు కిరీటము వజ్రములతో పొదిగినది కాక "ముళ్లతో పొదిగిన కిరీటము"ని గాంధీజీ ఒకప్పుడు వర్ణించియుండెను. కాంగ్రెసు అధ్యక్షులకన్న భారతీయుడాశించ కలిగిన ఉత్తమస్థానము మరొకటి లేదు. ఇంగ్లీషువారికి ప్రధానిత్వము, అమెరికావారికి అధ్యక్షత ఎట్లో భారతీయులకు కాంగ్రెసు అధ్యక్షత అటువంటిది. కాంగ్రెసు భారతజాతీయ అనధికార శాసనసభ. ఆరేళ్లపాటు కార్యభారము వహించి అలసిపోతినని, ఇక ఈ బాధ్యతనుండి తప్పించవలసినదని ఆజాద్‌గారు అనేక పర్యాయములు గాంధీజీని, సహచరులను కోరినట్లు వినికిడి. ఆ కారణమునే గాంధీజీ, కార్యవర్గసభ్యులు ప్రస్తుతకు సలహా నిచ్చుటయు, దానిని ఆయన అంగీకరించుటయు జరిగియుండవచ్చును.

అధ్యక్షాధికార విరమణ సమయమున సర్దార్ వల్లభాయి పటేల్ మొదలైనవారు ఆయనను గూర్చి చేసిన ప్రశంసోపన్యాసములు వ్యక్తిగతముగానే గాక, ఆయన నాయకత్వమునందు దేశమునకు గల గౌరవమునకు, అభిమానమునకు, విశ్వాసమునకు చిహ్నములు. "కాంగ్రెసు అధ్యక్ష పదవిని వరుసగా ఆరు సంవత్సరములు ఒకరు వహించుట ఇదే మొదటిసారి. ఆ గౌరవము మౌలానా ఆజాద్‌గారికి లభించినది. అతిబాధ ప్రయాసలతో కూడిన ఈ ఆరుసంవత్సరములలోనూ ఎప్పుడూ కూడా, ఆయన ఆక్రమించిన మహోత్కృష్టస్థాన గౌరవమర్యాదలకు భంగము కలిగేటట్లు ఆయన ప్రవర్తించలేదు. కాంగ్రెసు గౌరవానికి కళంకము రానివ్వలేదు. మరొకరు ఈ ఆరు సంవత్సరములలోను ఆయనవలె ధైర్యవిశ్వాసములతో ఈ బాధ్యతలను నిర్వహించి యుండలేకపోదురు. స్వాతంత్ర్య పోరాటములో మన స్థితిలో నుండుటకు ఆయన ప్రధాన కారణము. "భారత దేశమును విడిపొండు" అని 1942 సం॥లో బ్రిటిషువారి నడిగితిమి. మేము సిద్ధమే నని వారనుచున్నారు. ఒడుదుడుకులు లేకుండా దానిని సాధించుటానికి మనమిపుడు మార్గాలు ఆలోచించుచున్నాము. దీనికంతకీ ఆజాద్ గారి నభినందించవలసి యున్నది." అని సర్దార్ వల్లభాయి పటేల్‌గారు చెప్పిరి. "ఆతనిఅడుగు జాడలలో నడచి అంతధైర్య, ప్రతిభలతో నిర్వహించ గలవారు మనలో ఎవరున్నారు?" అని నెహ్రూగారనిరి.

ఇవి కేవలము లాంఛనాయుతమైన పొగడ్తలుగాక వాస్తవమైనవనే చెప్పవలసి యున్నది. భారత ప్రజానీకమునకు ఆజాద్‌గారి ఎడ ఉన్న భావములు పటేల్ నెహ్రూగార్ల ఉపన్యాసములలో ప్రస్ఫుటమైనవి. యుద్ధకాలములో, కాంగ్రెసుకు, అటు లీగు బ్రిటిషు ప్రభుత్వము విముఖమై యున్నపుడు కాంగ్రెసు వ్యవహారములను అతిచాతుర్యముగ నడపెను. ముస్లిములీగు అధ్యక్షుడు ఆతనిని అతినీచముగ దుర్భాషలాడినప్పటికీ, ఒక్క పరుషపు మాట అనలేదు. దేశభక్తి తప్ప సంఘాభిమాన మెపుడునూ లేదు. ముస్లిములు ఎంత వ్యతిరేక ప్రచారముచేసినప్పటికీ ఆయన చలించలేదు. బ్రిటిషువారిని కాక ముస్లిములను అణగద్రొక్కుటకు ఉద్దేశింపబడినదని ఆగస్టు ఉద్యమమును శ్రీ జిన్నాగారు వర్ణించిరి. ఆ ఉద్యమ సమయములో అధ్యక్షతవహించు గౌరవము ఆయనకు దక్కినది. క్రిప్సు రాయబారములప్పుడు అంతకన్న ఎక్కువగా సిమ్లా సమావేశమపుడు ఆయన చూపిన రాజకీయ నేర్పరితనము చాతుర్యము శివి అందరికి ఆశ్చర్యము గొలిపినది. మూడుమాసములు సాగిన ఢిల్లీ రాయబారములను కూడ అంత ధీమంతముగ నడపెను.

ఆజాద్ అధ్యక్షత అంతముతో కాంగ్రెసు ఇతిహాసమున ఒక ముఖ్య ఘట్టము ముగిసి నూతన ఘట్టము ఆరంభమైనది. ముగిసిన ఘట్టమును భారతప్రజ ఎల్లపుడూ గర్వముతో స్మరణకు తెచ్చుకొనెదరు.

## రాజ్యాంగ పరిషత్తు సెక్రటరీల ఆఫీసు

ఢిల్లీ, జూలై 8: ఇదివరలో ఇండియా ప్రభుత్వమువారు యుద్ధానంతర పునర్నిర్మాణ కార్యక్రమ ప్రణాళికలను తయారుచేయుటకు ఒక డిపార్టుమెంటును (ప్లానింగు అండ్ డెవలెప్‌మెంటు డిపార్టుమెంటు) ఏర్పాటు చేసియుండిరి. ఆడిపార్టుమెంటు ఇప్పుడు తొలగించి వేయబడినది. ఈ డిపార్టుమెంటులోని ఆఫీసరును సిబ్బందిని యిప్పుడు క్రొత్తగ సమావేశం కానున్న రాజ్యాంగనిర్ణయ పరిషత్తుకు సంబంధించిన సెక్రటేరియటు కార్యాలయములో నియమించారు. ఇప్పటికే రాజ్యాంగ పరిషత్తు కార్యాలయంలో హెచ్. వి. ఆర్. అయ్యంగారు, వి. పంచకంగారు కలరు. వీరు సర్ బి. ఎన్. రావుగారికి సహాయకులుగా పనిచేస్తారు. (స్వ. వి.)

## సమ్మె అంతము చేయుడు

### సింహళభారత కార్మికులకు కాంగ్రెస్ కార్యవర్గ ఆదేశము

విచారణసంఘ నియామకము

బొంబాయి, జూలై 8: రాజీకి అనుకూలమగు వాతావరణను కల్పించుటకుగాను సింహళములో తేయాకు, రబ్బరుతోటల యందు పనిచేయుచున్న భారత కార్మికుల సమ్మెను ఆపివేయవలెనని కాంగ్రెసు వర్కింగ కమిటీవారు సింహళ భారత కాంగ్రెసు వారిని కోరుకొనిరి.

సింహళ ప్రభుత్వమునకును ఆ దేశము నందలి భారతీయులకును మధ్య యేర్పడిన తగాదాను విచారించుటకును, భారతీయుల కష్టములను తొలగించుటకు అవసరమైన చర్యలు సూచించుటకును కాంగ్రెసు కార్యవర్గమువారొక విచారణసంఘ మేర్పరచిరి. ఈసంఘములో కాంగ్రెసు మహాసభాధ్యక్షులగు పండిత నెహ్రూ, శ్రీ సి. రాజగోపాలాచారి, శ్రీ ఆర్యనాయకం, శ్రీ రామచంద్రన్ గారలు సభ్యులుగా నుందురు.

వర్కింగు కమిటీవారి ప్రకటన

సింహళ భారత సమస్య విషయమై వర్కింగు కమిటీవారు గావించిన ప్రకటన యిట్లున్నది:—

సింహళ భారతీయులకును కార్మికులకును, ముఖ్యముగా ఆ దేశములో రబ్బరు, తేయాకుతోటల కూలీలకును హక్కులు, భద్రత, క్షేమలాభముల విషయమై తగాదా వచ్చినందుకు ఈ సంఘము వారు ఆందోళన జెందుచున్నారు. ఈ తగాదా ఫలితముగా భారత కార్మికులందరు సమ్మెచేసిరి. ఈ సమ్మె మూడు వారములనుండి సాగుచున్నది.

తమయెడల న్యాయముగా ప్రవర్తింపవలెనని, తమకు పౌరసత్వహక్కులు, ఎన్నికాధికారము ఒసంగవలెనని సింహళ భారతీయులు కోరుచున్న కోర్కెలయెడల ఈ సభవారు సానుభూతి కలిగియున్నారు. సింహళ ప్రభుత్వమునకును సింహళ భారతీయులకును మధ్య యిట్టి తగాదా ఉదయించుట సభవారికి అత్యంత సంతాపకారణమైనది. సింహళ భారతదేశములకు అత్యంత సన్నిహిత సంబంధములు కలవు. భవిష్యత్ కాలమునకూడ రెండుదేశములకు సంబంధ బాంధవ్యములు అత్యంత సన్నిహితముగా నుండకతప్పదు. ఈ కారణముచేత తగాదాలన్నిటిని న్యాయముగాను, ధర్మముగాను, రెండుదేశములకు గౌరవప్రదముగాను, ప్రజల స్వాతంత్ర్య విస్తరణకు అనుకూలముగాను పరిష్కరించుటకు అందరు వాంఛింపవలెను, అందరు కృషిచేయవలెను.

సింహళమునందలి భారత కార్మికులు ధైర్యసాహసములతో పోరాడి, చాలా త్యాగము గావించినందుకు సభవారు వారిని ప్రశంసించుచున్నారు. ఐనప్పటికి ప్రస్తుత సమ్మెను ఆపుచేయవలెనని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు. ఎందువల్లననగా, ప్రస్తుత సమ్మె ఆదేశమునందలి యావన్మంది భారత కార్మికుల ఆర్థిక సమస్యలకు సంబంధించిన దైనప్పటికీ రాజకీయోద్దేశ్యముతో అది సాగింపబడుచున్నది. రాజీకి అనుకూలమగు వాతావరణమును కల్పించుటకుగాను దానిని ఆపుచేయుట అవసరము. ఈ కారణముచేత సమ్మెను ఆపుచేయవలెనని ఈ సభవారు సింహళ భారత కాంగ్రెసును కోరుచున్నారు.

సింహళ భారతీయుల ఉద్యమము యెడల ఈ సభవారికి సంపూర్ణమగు సానుభూతి కలదు. సింహళ ప్రభుత్వమునకును భారతీయులకును మధ్య యేర్పడిన తగాదాను విచారించుటకును, భారతీయులకష్టములను తొలగించుటకు అవసరమైన చర్యలు సూచించుటకును సభవారు ఒక ఉపసంఘము నేర్పరుచుచున్నారు. ఈ సంఘములో పండిత నెహ్రూ, శ్రీ సి. రాజగోపాలాచారి, శ్రీ ఆర్య నాయకం, శ్రీ రామచంద్రన్ గారలు సభ్యులుగా నుందురు."

[అమెరికన్ అసోసియేటెడ్ ప్రెస్]

## మదరాసు కౌన్సిలులో బడ్జెట్‌పై చర్చ

మద్రాసు, జూలై 9: మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు జూలై 31 వ తేదీన సమావేశమైనప్పుడు రాష్ట్రీ బడ్జెటును ప్రవేశపెడతారు. ఆగస్టు 6, 7, 8 ఈ తేదీలలో చర్చ జరుగుతుంది.

న్యూస్ ప్రింట్ కంట్రోలు ఆర్డరుకింద జనసరి భారతదేశం పత్రికలపై ఆరోపింపబడి విచారింపబడుచున్న కేసులను ఉపసంహరించుకొనుటకు మద్రాసు ప్రభుత్వంవారు నిశ్చయించుకొనినట్లు తెలుస్తున్నది.

రివిన్యూ మంత్రి కళావెంకటరావుగారు 12 మదరాసులో బయలుదేరి 13 తెనాలి, గుంటూరు వెళ్లి 14 న తిరిగి మద్రాస్ వస్తారు.

## యూరపియనుల ఖండన

1 వ పేజీ తరువాయి

ఈ వ్యవహారమును గూర్చిన సంగతి సందర్భములను సంగ్రహంగా యీ దిగువ వివరించుచున్నాము.

(1) దక్షిణాఫ్రికాలోని భారతీయులు ముఖ్యంగా నేటాలు రాష్ట్రములో నివసించుచున్నారు. వీరు సుమారు 2½ లక్షల మంది కలరు. యూరోపియనులు 22½ లక్షల మంది కలరు. ఇక్కడ ఉండే భారతీయులలో విశేష భాగం కార్మికులుగా నున్నారు. ఇండియా గవర్నమెంటువారికిని, నేటాలు ప్రభుత్వమునకును ఏర్పడియుండిన ఒడంబడిక ననుసరించి 1860 సం॥ మొదలు 1911 సం॥ వరకు భారతీయులు చాలామంది దక్షిణాఫ్రికాకు వెళ్లియుండిరి. 1913 సంవత్సరానికి పూర్వము కంట్రాక్టు పద్ధతిగా కూలీలు చాలామంది దక్షిణాఫ్రికాకు పోయినప్పుడు వారివెంట కొందరు భారతీయ వర్తకులుకూడా అచటకు వెళ్లియుండిరి.

అచటకు పంపబడిన భారతీయ కార్మికులు స్వతంత్ర పౌరులుగానే భావింపబడవలెననియు, వారికి పౌరహక్కులన్నియు నుండవలెననియు మొట్టమొదటి ఒడంబడికలో ఒక ముఖ్యమైనషరతుగా నుండెను. కాని, అచటి భారతీయులకు 1885 సం॥ నుండియు ప్రాతినిధ్యక పౌరహక్కులు క్రమంగా తొలగింపబడెను. వారికి అచటి మ్యునిసిపాలిటీలలోగాని, అచటి పార్లమెంటులోగాని వోటింగు హక్కు లేదు. స్వేచ్ఛగా వర్తక వ్యాపారములు చేసికొనుటకు వీలు లేకుండా నిరోధములు కల్పింపబడెను. పబ్లికు ఉద్యోగాలలో గాని, రైళ్లలో ప్రయాణాలు చేయుటకు గాని స్వేచ్ఛావకాశములు లేవు. విద్యాభివృద్ధికి సౌకర్య సదుపాయములు లేవు. ఈ విధముగా భారతీయులయెడ విభేద భావమును చూపించుచున్నారు. ఈ విభేద భావము యిప్పుడు క్రొత్తగా అమలు పరచబడిన చట్టమువల్ల మిన్నుముట్టినది. ఆసియావాసుల భూముల అమరకం భారతీయుల ప్రాతినిధ్యం గూర్చిన చట్టమొకటి ఇటీవల శాసింపబడినది. ఈ చట్టం మూలంగా భారతీయులు కొన్ని ప్రాంతాలలో నివసింపరాదనియు, భూములకు సొంతదారులై యుండరాదనియు నిషేధములు కల్పింపబడెను.

2. దక్షిణాఫ్రికాలోని భారతీయుల వలసకు ఇండియా గవర్నమెంటువారు ఒక ఒడంబడికను దక్షిణాఫ్రికా ప్రభుత్వంతో వ్రాసికొని యుండుటవల్ల అచటి భారతీయుల విషయములో ఇండియా గవర్నమెంటుకు నిరంతరమైన బాధ్యత ఏర్పడియున్నది. అందుచేత అప్పుడప్పుడు ఇండియాగవర్నమెంటువారు యీవిషయం కల్పించుకొని, దక్షిణాఫ్రికా ప్రభుత్వమును హెచ్చరిస్తూవచ్చారు. దక్షిణాఫ్రికా ప్రభుత్వంకూడా ఇండియా గవర్నమెంటువారితో సంప్రతిస్తూవచ్చింది. 1926 సం॥ లోను 1932 సం॥లో ఉభయ ప్రభుత్వములకు మధ్య సంప్రతింపు సభలు జరిగెను. 1916 సం॥లో కేప్‌టవున్ ఒడంబడిక అనే ఒక ఒడంబడిక వ్రాసికోబడెను. భారతీయులకు ప్రత్యేక గూడెములను ఏర్పరచుటను గూర్చి ఆఒడంబడిక వ్రాసికోబడెను. 1932 సం॥లో ఉభయ ప్రభుత్వములు కలిసి ఒక జాయింటు ప్రకటనను చేసెను. ఈ ప్రకటన ప్రకారంగా కేపుటవున్ ఒడంబడిక యింకాఅమలులోనే ఉండవలెననియు, ఉభయప్రభుత్వములకు పరస్పర సహకారముండవలెననియు ఆప్రకటనలో వెల్లడింపబడెను.

భారతీయులను ప్రత్యేకంగా కొరిపెలు పల గూడెములలో నివసింపచేయవలెననే సిద్ధాంతము తామిటీవల అమలుపరచబడిన ఆసియావాసుల భూముల అమరకం గూర్చి నట్టియు, భారతీయుల ప్రాతినిధ్యమును గూర్చినట్టియు చట్టములో తిరిగి వర్తింపజేయబడెను. ఈ విషయములో ద.ఆఫ్రికా ప్రభుత్వముతో సంప్రతించుట కొక సంప్రతింపు సభను సమావేశపరచవలెనని ఇండియా ప్రభుత్వము కోరెను. పైజెప్పిన చట్టమును శాసించుటవల్ల కేపుటవున్ ఒడంబడికయున్నూ 1932సంవత్సరములో ఉభయ ప్రభుత్వాలు కలిసిచేసిన జాయింటు ప్రకటనయున్నూ ఆ ఒడంబడికకు సంబంధించిన రెండు పార్టీల పరస్పర సమ్మతితో కాకుండా ఆ రెండు పార్టీలలో ఒక్క పార్టీ మాత్రమే తృణీకరించినట్లయినది.

3. ఈ చట్టమును శాసించుటవల్ల ఇండియాలో చాలా విద్వేషాధిక్షేపణలు బయలుదేరినవి. వారి తీవ్రరూపమును దాల్చుచున్నవి. అందువల్ల దక్షిణాఫ్రికా ప్రభుత్వముతో ఏర్పడియున్న వ్యాపార ఒడంబడికను ఇండియా గవర్నమెంటు రద్దుచేసినది. దక్షిణాఫ్రికాలో ఇండియాగవర్నమెంటు తరఫున ఉన్న హైకమీషనరును అచటి నుండి పిలిపించి వేయవలసినది.

4. ఇప్పుడు ఏర్పడిన పరిస్థితులవల్ల ఇండియాకు దక్షిణాఫ్రికాకు గల స్నేహసౌ

## కాంగ్రెస్ వాలంటీర్ దళము

### స్థాపనకు బొంబాయిలో చర్యలు

బొంబాయి, జూలై 8: షానవాజ్ ఖాను నాయకత్వమున నొక కాంగ్రెసు వాలంటీర్ దళ స్థాపనమునకు నేడు నిశ్చితమైన చర్యలు గైకొనబడినవి. ఇట్టి సంస్థ నిర్వర్తింపవలసిన పనులవిషయమై షానవాజ్ పండిత నెహ్రూగారు నేడు మాటలాడుటకు అఖిల రాష్ట్రీయ కాంగ్రెసు సంఘముల అధ్యక్షులు, కార్యదర్శులు కాంగ్రెసుభవనములో సమావేశమైరి.

భారతదేశ భవిష్యత్ రక్షణకు కృషి చేయుటకుగాను యువకులను సమీకరించు కృషిలో సంపూర్ణముగా తోడ్పడవలసినదని షానవాజ్ ఖాను రాష్ట్రీయ నాయకులను కోరిరి.

ప్రజాప్రతినిధి పరిషత్తు స్వతంత్ర భారతమునకు రాజ్యాంగమును నిర్మించిన తరువాత భారతదేశమును రక్షించు బాధ్యత భారతీయులపైన బడునని, బ్రిటిషు ఆంగ్ల సైనికులు దేశమునుండి వెళ్లిపోయెదరని, వారు వెళ్లిపోవునపుడు దేశమును రక్షించుకొనుటకు యిప్పటినుండి సన్నాహములు చేయవలెనని షానవాజ్‌గారనిరి. భారతసేనపై మన కంట్రోలును బలపరుచుకొనవలెననిరి. ప్రస్తుత భారతసేనలో జాతిపక్షపాతము ప్రబలియున్నదని, భారతీయ భావ ప్రపూరితులైన వారినిద్వేషించుచున్నారని షానవాజు చెప్పుచు కాంగ్రెసు సేవా దళములో కూటికి వచ్చినవారు గాక ఇచ్ఛకముగా సేవచేయవచ్చిన వారుండవలెననిరి.

## పండిత నెహ్రూ

పండితనెహ్రూగారు కాంగ్రెస్‌వారి అహింసాసిద్ధాంతమునుగూర్చి ప్రస్తావించిరి. నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుటకును, గ్రామములలో మతసఖ్యతకలుగజేయుటకును అన్నిటికంటె ముఖ్యమైనది వివిధరాష్ట్రములలో యిప్పుడున్న కాంగ్రెసు ఐచ్ఛికభటసంస్థలను కేంద్రీకరించుటకును కాంగ్రెసు యాజమాన్యమున వాలంటీరుదళ మేర్పరుపబడుచున్నదనిరి. జనసామాన్యములో నిర్మాణ కార్యక్రమమును హృదయపూర్వకముగా కొనసాగించు ఐచ్ఛికభటులు మాత్రమే దీనిలో చేరవలెనని పండితుడనెను.

స్త్రీలకు ప్రత్యేకదళముండవలెనని సభకు వచ్చిన స్త్రీలు కోరిరి.

ముందేర్పరుపబడుచున్న ఐచ్ఛిక భటసంస్థ హిట్లరు, ముసోలినీ రోజులనాటి ఫాసిస్టు సైన్యములను పోలియుండరాదని రాష్ట్రీయ నాయకులు పలువురు చెప్పిరి. 'ఆయుధములుండవలెననుట.' సైనికులకు నేర్పు కవాతును ఐచ్ఛిక భటులకునూ నేర్పవలెననుట, దౌర్జన్యమును దౌర్జన్యముచే అణచవలెనని చెప్పుట కాంగ్రెసు సిద్ధాంతములకు విరుద్ధమని సరిహద్దురాష్ట్రీయ నాయకుడొకడు చెప్పెను.

## సింధు రాజకీయాలు

1 వ పేజీ తరువాయి

కలిగించుకోజాలరని సింధురాష్ట్ర ముస్లిం లీగు అధ్యక్షుడు గజ్దార్‌గారు ప్రకటించిన అభిప్రాయాన్ని బలపరుస్తున్నాను. మంత్రులలోనే వ్యక్తిగత అభిప్రాయభేదాలు వున్నవి కాబట్టి, అసెంబ్లీలోని లీగు పార్టీ లోనే ఎవరూ ప్రమేయం పెట్టుకోలేరు. రాష్ట్రంలో పెచ్చుపెరుగుతున్న లంచగొండితనంపై మంత్రివర్గానికి అధికారమే లేదు," పార్టీ సభ్యులు ఏకవాక్యమై ఒక నిర్ణయానికి రాకపోయినట్లయితే, చాలా మంది మిత్రులను మార్చుకలసివస్తుందని పార్టీ సభ్యులకు మాలిగ్గారు హెచ్చరిక చేస్తున్నారు.

ఇప్పుడే జాగ్రత పడకపోతే పరిస్థితులు పూర్తిగా మారిపోవచ్చునట. రాష్ట్ర క్షేమం నిమిత్తం లీగ్ అసెంబ్లీ పార్టీ స్థిరమైఖరిని ప్రదర్శించవలెనట.

సయ్యద్ కోరిక

సింధు కోయలిషన్ పార్టీ నాయకుడు జి. ఎం. సయ్యద్‌గారు ఇండియన్ యునైటెడ్ ప్రెస్ విలేఖరితో ఇలా అన్నారు: "ప్రస్తుత మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానాన్ని చర్చించడానికి గవర్నరు సమ్మతించాలి. ప్రస్తుత మంత్రివర్గానికి మెజారిటీ బలం లేదు."

త్వరలోనే ఇంకా నల్గురు లీగుసభ్యులు కోయలిషన్ పార్టీలో చేరుతారని తాను నమ్ముతున్నట్లు కూడా సయ్యద్ చెబుతున్నారు.

---

వము భంగము అయ్యేటట్లుగా నున్నది. అందువల్ల సంయుక్త రాజ్య మండలి ప్రణాళికలోని 10 నిబంధన 14 నిబంధన ప్రకారంగా యీ మహాజనుల దాఖలుచేసు కొనవలసినైనది. ఈ వ్యవహారమునకు సంబంధించిన విషయముల నన్నింటిని వివరించేటందుకు రికార్డు దస్త్రం ఇండియా గవర్నమెంటువారు మిసుకు పంపుకొనుచున్నారు.

## స్వదేశ సంస్థాన మంత్రులసభ

### జూలై 12, 13-వ తేదీలన

భోపాల్, జూలై 8: స్వదేశ సంస్థాన మంత్రుల సమావేశం (ముఖ్యమైనది) భోపాల్‌లో, జూలై 12, 13-వ తేదీలన జరుగుతుంది. మంత్రిత్రయ రాజ్యాంగ ప్రతిపాదనలనుగురించి చర్చిస్తారు. సర్ సి. పి. రామస్వామి అయ్యర్, సర్ మనూభాయి మెహతా, సర్ సుల్తాన్ అహమ్మద్, నవాబ్ అలియావర్ జంగ్, సర్దార్ కె. ఎం. పాణిక్కర్, సర్దార్ డి. కె. సెన్, సర్ గంగాకౌల్, సర్ టేక్ చంద్ వీరసింగ్, త్రిభువనదాస్ రాజా, మక్బూల్ మహమ్మద్ గారలు దీనికి హాజరవుతారని తెలుస్తున్నది.

## ప్రధాని ప్రకాశంగారి కార్యక్రమము

బొంబాయి, జూలై 8: మదరాసు ప్రధానియైన ప్రకాశంపంతులుగారు నేడు సర్దారు పటేలుగార్ని, ఆజాదుగార్ని కలుసుకుని సంభాషించారు. రేపు గాంధీజీని జవహర్లాలునూ కలుసుకుని తిరిగి మదరాసుకు బయలుదేరుతారు. అ. ప్రె.

## సంధిపత్రసవరణకై ఇంగ్లండ్ ఈజిప్టుల రాయబారాలు

సమాధానం చాలావరకు కుదిరినట్లేనని సిడ్కీపాషా

అలెగ్జాండ్రియా, జూలై 8: బ్రిటిషు ప్రాతినిధ్య నాయకుడైన లార్డు స్టాన్సేట్ ఈజిప్టుప్రధానియైన ఇస్మాయిల్ సిడ్కీపాషాను ఇవాళ కలుసుకున్నాడు.

లండనులో ఆయిదువారాలుండి లార్డు స్టాన్సేటు నిన్ననే కైరోకు తిరిగివచ్చాడు. సమావేశం ముగిసిన తరువాత, పత్రికా విలేఖరులతో లార్డు స్టాన్సేటు ఇలా అన్నాడు: "వ్యవహారం అంతా సరిగానే వుంది. సిడ్కీపాషా వసగండె." ప్రతినిధులు ఇవాళ మధ్యాహ్నం సమావేశమౌతారని, ఈజిప్టు ప్రధాని అన్నాడు. ఇంతలో కైరోవెళ్లి, రెండు రోజుల్లోగా తిరిగి రావాలని, సిడ్కీపాషా అనుకుంటున్నాడు.

ఇటీవల ప్రతిపాదింపబడిన క్రొత్త సంధిపత్రంలో ఏవో కొన్ని స్వల్పమైన అంశాలు తప్ప మిగతా సూత్రాలన్నిటికి, ఈజిప్టు ప్రతినిధులు అంగీకరించారని ప్రధాని ఇస్మాయిల్ సిడ్కీపాషా నేడుపత్రికా విలేఖరులకు వెల్లడించాడు.

## క్రొత్తకార్యవర్గసభ్యులు వీరేనా?

### అధ్యక్షుడుగాక 15 మంది వుంటారని సూచన

బొంబై, జూలై 8: కాంగ్రెస్ క్రొత్త కార్యవర్గంలో రాష్ట్రపతిగాక, 15 మంది సభ్యులు వుంటారని తెలుస్తున్నది: ఈక్రింద వారిలో బహుశా సభ్యులవుతారని వినవస్తున్నది: (1) ఆజాద్ (2) పటేల్ (3) రాజన్‌బాబు (4) రాజగోపాలాచారి (5) శరత్‌చంద్రబోస్ (6) ప్రఫుల్లఘోష్ (7) జయప్రకాశ్ (8) రామమనోహర్ లోహియా (9) శ్రీమతి కమలాదేవి (10) ఆచార్యకృపలానీ (11) గఫర్ ఖాన్ (12) ఆసఫ్అలీ (13) ఎస్. కే. పాటిల్ (14) మౌలానా ఘుజ్నవీ (15) జయరాందాస్ దౌలత్‌రామ్ (16) [illegible] (17) అచ్యుత్ పట్వర్ధన్ (18) విశ్వనాథ్‌దాస్.

## పాలస్తీనా సమస్య

1 వ పేజీ తరువాయి

గా నిలువబడిన రాజ్యాలనుమాని మేము భయపడుచున్నాము.

అరబ్బులకు యూదులకు నిజంగా విరోధం లేనేలేదు. పాలస్తీనాను యూదులకు మాతృభూమిగాను స్వదేశంగాను చేయవలెనని అమెరికా ఇంగ్లాండులు ప్రయత్నించుటవల్లనే యీ సంక్షోభం యావత్తు సంభవిస్తోంది. ఆంగ్లో అమెరికన్ కమిటీ పాలస్తీనాలో యూదులకు నివాసము కల్పించవలెనని తమ నివేదికలో వ్రాసెను. ఈఆంగ్లో అమెరికన్ కమిటీ న్యాయసమ్మతమైన కమిటీ యని అరబ్బీరాజ్యాల సమితి అంగీకరించుట లేదు.

పోపుకు పాలస్తీనా అరబ్బులవిజ్ఞప్తి

పాలస్తీనాలోని అరబ్బుల తాలూకు హైయరు కమిటీ తమ బాధలను తెలుపుచు క్రయిస్తవ జగద్గురువగు పోపునకు విన్నవించుకొనుటకై ఒక రాయబారవర్గమును ఇటలీలోని వాటికానకు (పోపుగారి నివాసస్థానము) ఒకటి రెండు రోజులలో పంపదలంచిరి. ఈ రాయబారవర్గంలో ఇద్దరుముస్లిములు ఇద్దరు క్రయిస్తవులు కలరు. ఈ రాయబారమునకు అనిసాబ్ అబ్దుల్ హాది గారు నాయకులుగా నున్నారు. వీరు పాలస్తీనా సుప్రీం కవున్సిలులో మెంబరుగా ఉన్నారు.

## రాజ్యాంగ పరిషత్తు: లీగు అభ్యర్థులు

### తన అధికారంపై జిన్నా వివరణ

న్యూఢిల్లీ, జూలై 8: ముస్లింలీగు అధ్యక్షుడు జిన్నా ఈ ప్రకటన చేస్తున్నాడు: "ముస్లింలీగు కార్యవర్గం జూను 9-వ తేదీన చేసిన తీర్మానాన్ని బట్టి, రాజ్యాంగ పరిషత్తుకు అభ్యర్థులను ఎన్నుకునే అధికారం కేంద్ర పార్లమెంటరీ బోర్డుకు ఇవ్వడమైనది. ఐతే ఈ బోర్డు రాష్ట్రీ ముస్లింలీగుల అధ్యక్షులతోనూ, వివిధ రాష్ట్రాలలోని ముస్లింలీగు పార్లమెంటరీ పార్టీ నాయకులతోనూ ముందుగా సంప్రతించడం అవసరం. అభ్యర్థులను కేంద్ర పార్లమెంటరీ బోర్డు రాష్ట్రనాయకులతో సంప్రతింపుల అనంతరం సెలెక్టు చేసిన తర్వాత, అఖిలభారత లీగు అధ్యక్షుడు తనకు సక్రమమని తోచిన మార్పులను చేసి ఫైనల్ చేయవచ్చు. కాబట్టి, ముస్లింలీగు కేంద్ర పార్లమెంటరీ బోర్డువారు చేసే నిర్ణయాలను పరిశీలించడానికిగాని, పూర్తిగా మార్చడానికి గాని, అప్పీళ్లు వినడానికిగాని నాకు అధికారం లేదన్నమాట. కేంద్ర పార్లమెంటరీబోర్డు ఒక నిర్ణయానికి వచ్చినతర్వాత, ఒక వ్యక్తి ఎన్నికవిషయంలో ఎవరైనా తీవ్రమైన ఆక్షేపణను లేవదీసే పక్షంలోనూ, లేదా ఒక ప్రముఖవ్యక్తికి, లేక వ్యక్తులకు స్థానం చేకూరని పక్షంలోనూ ఆలోచించి మార్పు చేయడానికి మాత్రమే నాకు అధికారం వున్నది. అందువల్ల, లిఖిత పూర్వకంగానూ, ముఖాముఖిగానూ వచ్చి నాకు విజ్ఞప్తులు అందజేసేవారి విషయంలోనే నేమీ చేయలేకపోతున్నాను. కేంద్రపార్లమెంటరీ బోర్డువారి నిర్ణయాలను మార్చడానికి నాకున్న అధికారాన్ని చులకనగా, చీటికీ మాటికీ ఉపయోగించడానికి వీల్లేదు. తీవ్రమైన అన్యాయం ఏదైనా జరిగితేనూ, ముస్లింలీగ్ క్షేమం నిమిత్తం వాస్తవంగా అవసరమైతేనూ మాత్రమే పార్లమెంటరీ బోర్డు నిర్ణయాలను నేను మార్చడానికి వీలవుతుంది. కాబట్టి, కేంద్ర పార్లమెంటరీ బోర్డువారు ఇదివరలో నిర్ణయించిన పేర్ల జాబితా నిఖరమైన జాబితా అన్నమాట. ముస్లింలీగు సభ్యులందరూ ఈ నిర్ణయానికి కట్టుబడివుండి తదనుగుణంగా ప్రవర్తించవలసి వుంటుంది."

## బొంబైరాష్ట్ర అభ్యర్థుల ఎన్నిక

బొంబై, జూలై 8: బొంబై శాసనసభ జూలై 15 తేదీ పూనాలో సమావేశమవుతుంది. రాజ్యాంగ పరిషత్తు అభ్యర్థుల ఎన్నిక జరుగుతుంది. గవర్నరు ఎన్నికకై ఈక్రింది తేదీలను నిర్ణయించాడు. నామినేషన్లు చేరడానికి ఆఖరు తేదీ జూలై 15. స్క్రూటినీ జూలై 16; నామినేషన్ల ఉపసంహారానికి గడువు జూలై 17: ఎన్నికలు జూలై 20; ఫలితాల ప్రకటన జూలై 24. మొత్తం 21 మంది అభ్యర్థులను ఎన్నుకోవాలి. వీటిలో 19 జనరల్ స్థానాలు; 2 ముస్లిం స్థానాలు.

## పంజాబు అభ్యర్థులు?

బొంబై, జూలై 8: రాజ్యాంగ పరిషత్తుకు పంజాబురాష్ట్ర అభ్యర్థులుగా కాంగ్రెస్ కార్యవర్గం ఈ క్రిందవారి పేర్లను ఆమోదించినట్లు తెలుస్తున్నది:

(1) దివాన్ చమన్లాల్ (2) డాక్టర్ గోపీచంద్ భార్గవ (3) భక్షి సర్ టేక్‌చంద్ (4) పండిత్ శ్రీరామశర్మ (ఎం. ఎల్. ఎ.) (5) పృథ్వీసింగ్ ఆజాద్ (6) మెహర్‌చంద్ ఖన్నా (ఎం. ఎల్. ఏ.) సరిహద్దురాష్ట్ర ఆర్థికమంత్రి; (7) కె. టి. ఎనిమిదవ స్థానానికి యూనియనిస్టు పార్టీ సభ్యుడిని నియమిస్తారు.

## ఒరిస్సా రాష్ట్రం

ఒరిస్సా రాష్ట్రంలో నామినేషన్లకు జూలై 11-వ వరకూ గడువు ఇచ్చారు. ఇప్పటివరకు 36 నామినేషన్లు తయారైనవి. వీటిలో హరేకృష్ణ మెహతాబ్ (ప్రధాని), విశ్వనాథ్ దాస్, పద్మనాభమిశ్ర మహారాణా, మాలతీ చౌదరి, నారాయణమూర్తి (ఎం. ఎల్. ఏ.) గారలు వున్నారు.

ఒరిస్సా శాసనసభ 17 వ తేదీన సమావేశమై ఎన్నికలు జరుపుతుంది.

## బెంగాల్ రాష్ట్రం

రాజ్యాంగ పరిషత్తుకు బెంగాల్ రాష్ట్రం అభ్యర్థులను ఎన్నుకునే విషయంలో చాలా రహస్యంగా కార్యకలాపం సాగిస్తున్నది. జూలై 10 వ తేదీన నామినేషనులు దాఖలైన తర్వాత పేర్లను ప్రకటిస్తారు.

## ఒరిస్సా అభ్యర్థులు: నామినేషనులు తేదీమార్పు

కటకం, జూలై 8: రాజ్యాంగ పరిషత్తుకు ఒరిస్సా అభ్యర్థులు నామినేషనులు దాఖలు చేయవలసిన తేదీ జూలై 8 వ తేదీనుంచి 11 వ తేదీకి మార్చారు. స్క్రూటినీ కూడా ఆదే రోజున జరుగును. ఎన్నిక జూలై 17 వ తేదీన జరుగుతుంది. ఏ. ప్రె.

